Registered No. M-4345.

# యుద్ధ సంచిక.

వాల్యూం I.] మద్రాసు : 1941 వ సం॥ డిసెంబరు నెల 19 వ తేది శుక్రవారం [నె 40 రు

## హిట్లరు జట్కా.

జట్కా గుఱ్ఱం పరుగెత్తినంతసేపూ బాగానే పరుగెత్తుతుంది. కాని అప్పుడప్పుడు ఆ జట్కాగుఱ్ఱం బెదురుతుంది. ఎంత కొట్టినా, ఎంత తోలినా ముందుకు ఒక్క అడుగైనా వెయ్యదు. కొట్టినకొలదీ వెనుకకునడవడం ప్రారంభిస్తుంది. ఇంకా దెబ్బలుకొట్టి బలాత్కారంచేస్తే, వెనుక కాళ్లు రెండూ పైకెత్తి జట్కాబండిని, జట్కావానిని, బండిలో వున్నవాళ్లను క్రిందకు పడగొట్టి, జీను తెంచుకొని, నడి బజారులో విచ్చలవిడిగా పరుగెత్తుతుంది. హిట్లరు దండయాత్రకు యిప్పుడు ఆ దేగతిపట్టింది. ఐరోపాఖండంలో ఒక రాజ్యం అయినతర్వాత ఇంకో రాజ్యం అతివేగంగా, గుర్రం పరుగెత్తినట్లుగా, జయించుకుంటూ వచ్చాడు. కాని ఆ జట్కా ఎక్కడో నడిరోడ్డుమీద తప్పకుండా విరిగిపడుతుంది. రష్యాలోకూడా తన గుఱ్ఱపుబండీని కొంతవరకు పరుగెత్తించాడు. తన సేనలను ముందుకుపొమ్మని తరిమితరిమి పంపించాడు. రష్యాతో యుద్ధం మూడునెలలలో అయిపోతుందని ఆశపడి ఆరంభిస్తే ఆరు నెలలకుకూడా ఆఖరుకాలేదు. ఇంత దీర్ఘకాలం యుద్ధం చేయవలసిన గతి సంభవించేసరికి హిట్లరు బెదిరిపోయినాడు. హిట్లరుకు గుండెలో రాయిపడింది. అందుకు ఇంకో కారణంకూడా ఉంది. రష్యాలో యీ చలికాలంలో ఆ మంచుగడ్డలలో అడుగుతీసి అడుగుపెట్టడం అసాధ్యం. అది చలికాదు పులి—శత్రుసేనలను సర్వనాశనంచేసే చలి అది—ఆ చలికి ఆ రష్యనులే ఆగగలరుగాని, ఇంకెవ్వడూ ఆచలిని భరించలేడు. పూర్వం యిదివర కొకపర్యాయం నెపోలియను చక్రవర్తి యీ రష్యాను జయించవలెనని దండయాత్ర సాగించాడు. శీతకాలంలోనే ఆ దండయాత్ర సాగించాడు. ఆ రష్యను మంచుగడ్డలలో సేనలన్నీ సర్వనాశనం అయిపోయినాయి. అప్పుడు ఆ నెపోలియను చక్రవర్తి ఏమిచేసినాడయ్యా అంటే, "తెలియకవచ్చినానురా దేవుడా! ఇంకెప్పుడూ నా జన్మలో రష్యామీద యిటువంటి దండయాత్రలు చెయ్యనురా స్వామీ!" అని చెంపలు వేసుకొని స్వదేశం చేరుకున్నాడు. అటువంటి రష్యను చలిలో యిప్పుడు జర్మను సేనలుకూడా చిక్కుపడి దిక్కు మొక్కు లేక తోక ముడతపెట్టి వచ్చినదోవ చూచుకుంటూ దౌడుతీస్తున్నాయి. హిట్లరుగారి జట్కా గుర్రం ముందుకు నడవకుండా వెనుకకు నడుస్తోంది. ఇంకో దెబ్బకొట్టితే బండినికూడా బోల్తాకొట్టించే తలతిక్క గుర్రాన్ని ఏంజేస్తాడు? "హెయ్! హెయ్!" అని హిట్లరు కళ్లెంబిగించి బండిలోనుండి బయటికి దూకి గుర్రాన్ని ఎంత బుజ్జగించినా, ఎంత లాలించినా ప్రయోజనంలేకుండా ఉంది. రష్యాలోని హిట్లరు సేన అక్కడి యమ చలిబాధకు పూర్తిగా బెదరిపోయింది. ఇదేసమయమని రష్యనులు ఆ జర్మనులమీదపడి చావగొట్టుతున్నారు. అందుచేత మాస్కో నగరాన్ని ముట్టడించడానికి బ్రహ్మాండమైన సన్నాహాలతో చండప్రచండంగా బయలుదేరివచ్చిన జర్మనుసేనలన్నీ ఇప్పుడు యీచారంలో రోజుకొక ఆమడదూరం వెనుకకు నడుస్తున్నాయి.

ఆరు నెలలనుంచీ అఖండ దండయాత్ర సాగించి మాస్కోనగరం సమీపంవరకూ వచ్చిన జర్మను సేనలు ఇంతదూరంవచ్చి చేసినపని ఏమిటి? వృథాగా రష్యాలో లక్షలకొలది జర్మనులను బలియివ్వడమైంది. పూర్వ మొకపర్యాయం ఒక యజమానివద్ద పుల్లయ్య అనే నవుకరు వుండేవాడట. ఒకనాటి రాత్రి ఆ యజమాని పడకగదిలో తన భార్యతో మాట్లాడుతూ, "మన పుల్లయ్యను రేపు వేమవరం పంపిస్తే మంచిది" అని ఏదో సంభాషణ సందర్భంలో అన్నాడట. ఆ దంపతులు అనుకొన్న మాటలను వీధి అరుగుమీద కూర్చుండి పుల్లయ్య విన్నాడట. యజమానికి సంతోషం కలిగేటట్లుగా ముందుగానే వేమవరం వెళ్లిరావడం మంచిదని తలంచి, ఆ పుల్లయ్య వేమవరంవెళ్లి, ఉదయం ప్రొద్దు ఎక్కగానే తిరిగి యింటికి వచ్చాడు— "ఏం పుల్లయ్యా! ఎక్కడికి వెళ్లావు?" అని యజమాని అడిగాడు. తమరు చెప్పకముందే వేమవరం వెళ్లివచ్చానండీ అని పుల్లయ్య జవాబు చెప్పాడు. "అయితే పుల్లయ్యా! నీవు వేమవరం ఎందుకోసం వెళ్లావు? ఏంపని చేసుకొని వచ్చావు? నీవు వెళ్లడం, రావడం జరిగిందిగాని అనుకొన్నపని ఏమీ నెరవేరలేదు." అని యజమాని పుల్లయ్యతో చెప్పి, పుల్లయ్య తెలివికి చాలా సంతోషించాడు. ఆఖరుకు హిట్లరు సైన్యాలుకూడా పుల్లయ్య వేమవరం వెళ్లినట్టుగానే చేస్తున్నాయి. ఆ జర్మను సైన్యాలు మాస్కోవరకు వెళ్లడమూ అయింది. తిరిగి వెనుకకు రావడమూ అయింది. అటువంటి జర్మను సైన్యాల ప్రతాపానికి ఆ హిట్లరు ఎంత మురిసిపోతున్నాడో! "నా సైన్యాలేగదా ఇంత ధైర్యంగా రష్యాలోకి చొరబడి, మాస్కోవరకు వెళ్లిరాగల్గిన" వని హిట్లరు ఆనందిస్తూ ఉండవచ్చు. అట్లా ఆనందించే హిట్లరుకంటే వెర్రి పుల్లయ్య ఇంకొకడు యీ జగత్తులో పుట్టబోడు.

వచ్చిన వార్తలనుబట్టి చూస్తే రష్యాలోఉన్న జర్మనుసేనలు ఇప్పటికే చాలాదూరం వెనుకకు పారిపోయినాయి. కొన్నిచోట్ల జర్మనుల ఆయుధసామగ్రి విశేషంగా రష్యనుల చేతులలో చిక్కుతున్నది. అంతేకాదు జర్మనుల మోటారులారీల చక్రాలు మంచుగడ్డలలోనే చిక్కుకొని కదలలేకుండా స్తంభించిపోతున్నాయి. పారిపోయివచ్చిన జర్మను సేనలను జర్మనీదేశంలోకి హిట్లరు రానివ్వడంలేదు. ఈవిధంగా పారిపోయివచ్చిన సేనలను జర్మనీలోని ప్రజలు చూస్తే నిరుత్సాహపడి కంగారపడిపోతారనే భయంచేత, పలాయనమైవచ్చిన జర్మను సేనలను జర్మనీలోకి పోనివ్వక, దారిలోఉన్న బల్గేరియాలోనే మకాముగా వుంచినాడు. ఇంతవరకు రష్యాయుద్ధంలో రమారమి 60 లక్షల జర్మనులు నష్టమైనారు. అనగా ఒక తరంవాళ్ళు పూర్తిగా నాశనమైనారు.

రష్యాలో హిట్లరుగారి జట్కాగుర్రం పూర్తిగా బెదిగింది. అక్కడమాత్రమే కాదు. ఎక్కడకు వెళ్లినా శని వెంటవస్తూనే వుంది. రామేశ్వరం వెళ్లినా శనేశ్వరం తప్పదు.

రష్యాలో దెబ్బతిన్న సేనలనే,—అక్కడ చెల్లని బండ పైసాలనే,— ఉత్తరాఫ్రికాలో లిబియాలో పోరాడేటందుకు హిట్లరు పంపిస్తున్నాడు. ఉత్తరాఫ్రికాలో లిబియాలోకూడా జర్మను సేనలను బ్రిటిష్ సేనలు గొర్రెల మందలను తోలినట్లుగా తోలుతున్నాయి. మొన్న బ్రిటిష్‌వారు గజాలావద్ద కొట్టిన దెబ్బకు గజగజలాడుతూ, కాలికి బుద్ధిచెప్పి, జర్మను సేనలు వెనుకకు పారిపోయినాయి. హిట్లరు ఇప్పుడు ఒక కాలు రష్యాలోను, రెండో కాలు ఉత్తరాఫ్రికాలోను పెట్టుకొని రెంటికి చెడిన రేవడులాగున రెండువిధాలుగా భ్రష్టుడౌతున్నాడు. ఉభయభ్రష్టత్వం అయితేగాని ఉపరిసన్యాసం ప్రాప్తించదు. తన్నుమాలిన పనికిపోయిన ఒక కోతి, సగం చీల్చిన దూలంమీద కూర్చుండి ఒకకాలు అటు, ఇంకొక కాలు ఇటు వ్రేలాడవేసుకొని, ఆ దూలంమీద గుర్రపుసవారీ చేసినట్లుగా కూర్చుంది. సగంచీల్చిన దూలం మధ్యలో పిరుదులు ఆనించి కూర్చుండి, ఆ చీలిక మధ్యనున్న కొయ్యసీలను చేతులతో ఊడబెరికింది. ఆ సీల పైకిలాగితే, దాని ఆయువు పట్టువంటి పిరుదుభాగం చీల్చిన దూలంలో చిక్కి నొక్కుకొనిపోయి ఆకోతి ప్రాణాలు విడిచింది. రషియాలో ఒక కాలుపెట్టి, లిబియాలో ఇంకో కాలుపెట్టి మధ్యనున్న మధ్యధరా సముద్రంలో బ్రిటిష్‌వారియుద్ధనావలనుకూడా ఎదిరించాలని హిట్లరు ప్రయత్నిస్తే,—ఆఖరుకు అటూ, ఇటూ కాకుండా, మధ్యకూడా దెబ్బతిని, కోతివలె అధోగతిపాలవుతాడు.

## హిట్లరుమంత్రం పారలేదు.

జపానును ఎట్లాగైనా మచ్చికచేసి, మచ్చుమందు జల్లి, తన వలలో వేసికొని, తన చేతిలో కీలుబొమ్మలాగు చేసుకొని, తాను సంకల్పించినప్రకారంగా తనకు దాసోహం అని జపానుకూడా ప్రవర్తించేలాగున చెయ్యాలని హిట్లరుకు ఆశ ఉంది. అమెరికామీదను, ఇంగ్లాండుమీదను యుద్ధంప్రకటించేటట్లుగా జపానును ప్రోద్బలంచేసాడు. తానుకూడా అమెరికామీద యుద్ధం ప్రకటించాడు—రష్యామీదకూడా జర్మనీ దండెత్తి యుద్ధం చేస్తోంది. కనుక రష్యామీద జపానుకూడా యుద్ధం ప్రకటించవలెనా అక్కరలేదా? ప్రకటించవలసిందే. కాని, "రష్యామీద యుద్ధం ప్రకటించను" అని జపాను ఖండితంగా జవాబు చెప్పింది.

దీనిభావమేమి తిరుమలేశ? జర్మనీకి శత్రువైన రష్యారాజ్యం జపానుకు మిత్రరాజ్యంగానే ఉంటోంది. అట్లయితే, ఇక జపానును తన మాట ప్రకారంగా గిరిగీచి గిరిలో ఉంచుకోవలెనని హిట్లరు చేసిన ప్రయత్నం అక్కరకురాలేదని స్పష్టంగా అర్థమౌతూ ఉన్నది. హిట్లరు చేసిన తంత్రం సరిగా పనిచెయ్యలేదు. "హిట్లరుబావ ఎట్లా చెప్పితే అట్లా చేస్తా" అని హిట్లరువెంట బడి ప్రాకులాడిన జపాను ఇప్పుడు, హిట్లరుబావతో సమానంగా గంతు వెయ్యడం లేదు.

సంగతి సందర్భాలన్నీ జపానుకు తెలుసు. రష్యాతో యుద్ధానికి దిగితే, హిట్లరుబావకు రష్యాలో కలిగిన అవస్థలే తాను కూడా అనుభవించక తప్పదని జపానుకు తెలుసు. పూర్వమొక యిల్లాలు నూతిలో దూకుతానని చెప్పి నడుము కట్టుకొని నూతి దగ్గరకు వెళ్లింది. ఆ పాడు నూతిలో పెద్ద గోదురు కప్పలు బెక బెక లాడుతూ భయంకరంగా ధ్వనిచేసే సరికి, "అమ్మయ్యో! యీ నూతినిండా కప్పలున్నాయి బాబో!" అని వెనుకకు పారిపోయింది. చావుకు తెగించి నూతిలో దిగడానికి వెళ్లిన మనిషిఅయితే, కప్పలకు భయపడి పారిపోయి వస్తుందా? రష్యామీద దండెత్తి, చావుకైనా తెగించి, జయించాలని బయలుదేరిన జర్మను సేనలు అక్కడి చలికి ఆగలేక, రోజుకొక ఆమడ దూరం వెనుకకు తిరిగి వస్తున్నాయి. ఇదంతా జపాను చూస్తోంది. హిట్లరుబావ మాట నమ్ముకొని ఏటిలోకి దిగితే ఎటువంటి అవస్థల పాలు కావలసి వస్తుందో కొంతవరకైనా జపాను కళ్లుతెరిచి గ్రహిస్తోంది.

కాని, రాజ్య కాంక్షతో, అక్రమంగా ఎవరి రాజ్యమైనా సరే ఆక్రమించుకోవలెననే ఆశతో, జపాను ప్రభుత్వం కోతి గంతులు వేస్తోంది. పసిఫిక్కు మహాసముద్రంలో ఎన్నోలంకలు ఉన్నాయి. కొన్నిలంకలు జపానువారివి. కొన్నిలంకలు బ్రిటిషువారివి. కొన్నిలంకలు అమెరికావారివి. ఆలంకలన్నీ తనకేకావాలి అని యీ జపాను కొండముచ్చు ఆ సముద్రంలోని లంకలమీద నానా భీభత్సం చేస్తోంది. ఆలంకమీదనుంచి యీ లంకమీదకు, యీ లంకమీద నుంచి ఆలంకమీదకు ఎగిరి బాంబులు వేస్తోంది. ఆమూలనుంచి ఈమూలకు రమారమి మూడువేల మైళ్ల దూరం వరకు ఫసిఫిక్కు మహాసముద్రంలో యీ లంకలన్నీ విస్తరించి ఉన్నాయి. అమెరికావారి లంకలమీదనే తన అహంకారం అంతా చూపిస్తోంది. ఆలంకలన్నింటిని నమిలి మ్రింగి వెయ్యాలనే ఆగ్రహంతో ఉగ్రావేశంతో జపాను విమానాలు, జపాను నావలు, పసిఫిక్కు సముద్రం అంతటా గంగ వెర్రులెత్తినట్లుగా తాండవమాడుతున్నాయి: ఈ లంకలలో చిందులు తొక్కడమే అమెరికాతో యుద్ధం చెయ్యడం కాబోలు!

బ్రిటిషు సింహంతోకూడా ఈ జపానుకోతి చెలగాటం ప్రారంభించింది. సింగపూరుమీదకు వెళ్లి సింగపూరును పట్టుకోవలెనని పాపం! గంపెడాశతో గంతువేస్తోంది. సింగపూరు రేవు అంటే ఏమిటో అనుకుంటోంది? ఫిరంగులతో సింగారించిన సింగపురం సింగపూరు కాదు ఫిరంగిపురం, బ్రిటిషు సింగము దాగి పొంచి ఉన్న గుహ అది. సింగపూరు చేరడానికి మలయా వుత్తర భాగంలోనుంచి జపాను సేనలు దండెత్తి వస్తున్నాయి. బ్రిటిషు సింహం కంఠంలో ప్రాణం ఉన్నంతకాలం సింగపూరులో జపానుసేనలు అడుగు పెట్టజాలవు.

చైనాలో గంతులు వేసినట్లుగానే యీ జపానుకోతి బ్రిటిషు సామ్రాజ్యంలో కోతి కొమ్మచ్చులాడవచ్చుననుకుంటూ ఉన్నది. జపాను దేశం అంటే సూర్యుడుదయించే రాజ్యం అని అర్థం బ్రిటిషు రాజ్యం అంటే సూర్యుడెన్నటికీ అస్తమించని రాజ్యం. నిన్న మొన్న కొత్తగా తలపైకెత్తుకొని తిరుగుతున్న జపాను ఇప్పుడు బ్రిటిషు సామ్రాజ్యంతో డీ అంటే డీ అంటోంది. పిల్లకాకికేమి తెలుస్తుంది ఉండేలు దెబ్బ? అనంతమైన బ్రిటిషు సామ్రాజ్యంలో అడుగుపెట్టింది జపాను సేన. లోతు తెలియకుండా ముందుకు అడుగువేస్తోంది. బర్మాలోని ఒక దక్షిణపు కొనలోనికి ప్రవేశించింది.

అమెరికావారి జలాంతర్గాములు డజనులకొలదీ జపాను చుట్టూ ఉన్న సముద్రంలో తిరుగుతున్నాయి. జపాను నావలు కనబడితే చాలు, సముద్రస్నానం చేయిస్తామంటున్నాయి. గోవిందా! అని గంగపాలు చేయడానికి సిద్ధంగా ఉన్నాయి.

"ఇదే సమయం. ఇంకా చూస్తారేమిటి? ఇప్పుడే జపాను సేనలను చావగొట్టాలి" అని చైనాలో వారికి వీరావేశం కలిగింది. అక్కడ చైనాలో ఒక కాలుపెట్టి రెండో కాలు పసిఫిక్కు సముద్రంలో పెట్టి యుద్ధం చేస్తున్న జపానుకోతి మధ్యనున్న సింగపూరును దూలంమధ్యఉండే సీలనులాగినట్లుగా పైకి లాగుతోంది. హిట్లరు ఇదంతాచూస్తున్నాడు. జపాను చిక్కులపాలైతే హిట్లరుబావ కేమి భయం? జపాను ఓడిపోతే "నీ కర్మం నేనేం చెయ్యను?" అంటాడు. ఈ జపాను కోతిని గోతిలో దింపింది హిట్లరే. తాచెడిన కోతి వనమంతా చెరిచింది అన్నట్లుగా, జపాను ఇప్పుడు పసిఫిక్కు లంకలలో బాంబులు వేస్తోంది.

# ఫిలిప్పైను ద్వీపులు.

## అమెరికాయొక్క పసిఫిక్ రక్షణ శిబిరము.

పసిఫిక్ మహాసముద్రమునందు ఏషియా తీరానికి కొంచెం దగ్గర ఫిలిప్పైను దీవులుగలవు. ఇవి మామిడికాయల గుత్తివలె దగ్గరదగ్గరగనుండు పెక్కు దీవుల సమూహం; అమెరికా సంయుక్త రాష్ట్రముల పరిపాలనక్రింద నున్నవి. వీటికి పడమరగ 5,000 మైళ్ళ దూరాన మహాసముద్రం నడిభాగమునందున్న హవాయి అనుదీవిలో పెరల్ హార్బరు అను చోట అమెరికావారి ముఖ్య నౌకాదళ కేంద్రం ఉంది. ఫిలిప్పైను దీవులకు తూర్పు-దక్షిణములకు మధ్యగ మలయా ద్వీపకల్పం చివరను సింగపూరు నౌకాశ్రయంగలదు. ఇది బ్రిటిషువారి ఒకటో తరగతి నౌకాదళకేంద్రస్థానం.

జపాను, బ్రిటను-అమెరికాలపై యుద్ధం ప్రకటించి పక్షం దినములు సాగించినది. అమెరికా నౌకాదళం హవాయి నుండి వచ్చి జపానుపై పడకముందే, సింగపూరు, ఫిలిప్పైను దీవులను లోంగదీయాలని జపాను చూసింది. ఈ రెండు శిబిరాలు తీసుకుంటేకాని జపాను సురక్షితంగా బర్మాలోనికిగాని, దక్షిణమున డచ్చి ద్వీపులపైకి, ఆస్ట్రేలియాపైకిగాని దాడిచేయుటకు వీలుండదు. సింగపూరు రక్షణకు చాలకట్టుదిట్టములు చేయబడి, ఎంతనష్టమైన చివరవరకు పోరుటకు నిశ్చయించియున్నారు. ఇక ఫిలిప్పైనుల సంగతి చూద్దాం.

ఫిలిప్పైను దీవులకు పడమరను ఇండో-చీనా, తూర్పున జపాను పాలనక్రిందనున్న మాండేటు దీవులుగలవు. ఉత్తరమున జాపానువారిదగు ఫార్మోసా దీవియు దక్షిణమున డచ్చి తూర్పు దీవులుగలవు. ఫిలిప్పైను దీవులలో విడబడియున్న చిన్నదీవులు ఉత్తరాన ఫార్మోసానుండి దక్షిణమున బోర్నియోవరకు విస్తరించియున్నవి. అన్నింటిలోను పెద్దదీవి లుజాను అన్నది యీ గుత్తిలో ఉత్తరముననున్నది. ఇది చీనా తీరానికి 500 మైళ్ల దూరం. లుజానులో ముఖ్య పట్నం మనీలా. ఇదియే యీ దీవులన్నింటికి ముఖ్య పట్నం. ఇది బ్రిటిషువారి హాంగ్ కాంగునకు 640 మైళ్ళు, సింగపూరునకు 1,340 మైళ్లలోగలదు. ఈ దీవులకు 1,500 మైళ్ల దూరంలో పడమరగనున్న గువం దీవియే అతి చేరువయగు అమెరికా దీవి. గువం జపాను మాండేటరీ పాలన ప్రాంతం మధ్యలో నున్నది. ఈ గువమును యిపుడు జపాను వారాక్రమించినట్లు తెలియుచున్నది.

### దీవుల లక్షణములు.

పిలిప్పైను దీవులు మొత్తం 115,000 చదరపు మైళ్లు; సుమారు ఇంగ్లాండు దీవులంత; 160 లక్షల జనసంఖ్య. చిన్నచిన్న దీవులన్ని కలిసి మొత్తం వేలకొలది దీవులు యుంటాయి. అన్నింట పెద్దదగు లుజాను 40,814 చదరపు మైళ్లు దక్షిణమున, మిండానో అన్నది 36,206 చదరపు మైళ్లు. ఈ రెండింటి మధ్య ఎనిమిది ఎన్నదగ్గ పెద్ద దీవులున్నాయి. వీటికి పడమర కాల్మానియా అను దీవులు, సన్నగ పొడుగ్గా బెండకాయలాంటి పలవాను అను దీవియు గలవు. పలవాను దక్షిణకొస బ్రిటిషువారి ఉత్తర బోర్నియో దీవి కొసకు తగులుచున్నట్లుండును. ఈ దీవులు ఉత్తర దక్షిణములకు సుమారు వేయిమైళ్లు విస్తరించియున్నందున అనేక రకముల శీతోష్ణస్థితి కలిగియున్నవి. విపరీతమైన ఎత్తుపల్లాల వ్యత్యాసంగలదు. అందుచే పంటలుగూడ అనేక రకాలవిగలవు. ఉత్తర భాగం తరుచు భూకంపాలకు లోనగును. మధ్యభాగం దీవులలో అగ్నిపర్వతాలు గలవు. కొండలవరుస అన్ని దీవులకు మొత్తంగా ఉత్తర-దక్షిణములుగా వ్యాపించియుండును. అదివరకు అగ్ని పర్వతాలు ప్రేలుట వలన వాటిప్రక్క లోయలు సారవంతంగానున్నవి. విస్తీర్ణంలో నూటికి 63 వంతు సాగుచేయతగినదిగా నుండును. కాని చాలభాగం యింకను అడవులుగనేయుంది. నూట 14 వంతే నాగలిచాలు కలిగియుంది.

### జపానువారి ప్రాబల్యం.

ఫిలిప్పైను దీవుల సంపదంటే ధాన్యం, బియ్యం పంటలు కావు; బంగారు, క్రోమైటు, చక్కెర, కొబ్బరి, జనుము, పొగాకు వంటివి. మనీలాలో అరటిచెట్టువంటి చెట్టుయొక్క నారతో చాల గట్టిత్రాళ్లు పేనుతారు. అది చాల ప్రసిద్ధికెక్కిన వ్యాపారం. ఫిలిప్పైను దీవుల నివాసులు ఎక్కువమంది మలయు జాతివారు. స్పెయిను, చీనా జాతుల కలయికగూడగలదు. లోభాగంలో అనాగరిక కొండజాతులవారు కొద్దిమంది కలరు. మలయాజాతులవారు వేరువేరు కాలములందు యీ దీవులలో ప్రవేశించి 20 రకాల జాతులున్నారు. నూటిలో తొంబదిమంది క్రైస్తవ మతస్థులు. విదేశీయులలో అమెరికా పాలక జాతులకుచెందిన వర్తకులు ఉద్యోగులు; తరువాత పెద్దసంఖ్య చీనావారు. చిల్లర టోకు వ్యాపారమంత వీరి చేతులలోనేయుంది. వీరు సామాన్యంగ దేశీయులగు మలయావారితో వివాహాలుకూడ చేసుకుంటారు. విదేశీయు లందరిలోకి ఎక్కువ అల్లరిజాతి జాపానువారు. వీరు సుమారు 30,000 కలరు. చేపలవ్యాపారం అంతా వీరి చేతులోవుంది. అందుచే సముద్రాలలో ప్రయాణ మార్గాలు సాధక బాధకాలన్ని వీరికి బాగా తెలియును. మిండానోలో నారపీచు వ్యాపారం వీరిదే. అదికాక ఇనుము, రాగి, మాంగనీసు లోహ వ్యాపారాలుగూడ వీరి స్వాధీనమునందే యుంచుకొనిరి. దేశీయులతో సంబంధం లేనివారికి భూములపై హక్కుండదని చట్టంచేయగా, యీ చట్ట నిరోధంనుండి తప్పించుకొనుటకే ఎందరో జపానువారు ఫిలిప్పినో దేశీయులను వ్యాపారంకొరకు వివాహాలాడి, వారి పేరన ఆస్థు లనుభవించి డబ్బు తీసుకపోవుచున్నారు. అమెరికా అధికారులు యీ దీవులలో డబ్బు మదుపుపెట్టి వ్యాపారం చేయడానికి జంకుతువుంటే జపానీయులు ఎన్నో తగాలనుండి ఆర్థికాధికారమును పెంచుకొనుచున్నారు. కావున యీ సమయమున వీరి కుట్రలు జాగ్రతగ కనిపెట్టుతూ వుండాలి.

### పరిపాలనా విధానం.

ఫిలిప్పైను దీవులు స్పెయిను-అమెరికా యుద్ధఫలితంగా 1898 వ సంవత్సరములో అమెరికావశమైనవి. 1907 వ సంవత్సరము వరకు తిరుగుబాటులు అణగి పూర్తిగ వశంకాలేదు. 1913 వ సంవత్సరము నాటికి పరిపాలనా అధికార వుద్యోగములందు నూటికి 73 దేశీయుల కొసంగబడెను. 1934 వ సంవత్సరములో అమెరికా యీ దీవులకు క్రమేణ సంపూర్ణ స్వాతంత్ర్యంయిచ్చు చట్టం గావించెను. దీనిప్రకారం పదేండ్లవరకు (1946 వ సంవత్సరము వరకు) విదేశ వ్యవహారాలు, ఆర్థిక పరిపాలన, సుంకముల అధికారం అంత అమెరికా ప్రభుత్వానికేయుండును. దేశరక్షణ బాధ్యత, నౌకాదళం, సైనిక శిబిరాలుకూడ అమెరికా ప్రభుత్వంక్రిందనేయుండును. ఇవి 1946 వ సంవత్సరము తరువాతకూడ అమెరికావశమం దుండవచ్చును. మణీలాలో

అమెరికా హై కమిషనరు ఒకడుండును. కాని యిపుడు 1946 వ సంవత్సరము దగ్గరపుతున్నందున ఫిలిప్పినో దేశీయులలో అత్యంత అతివాద దేశాభిమానులుకూడ సంపూర్ణ స్వాతంత్ర్యం పుచ్చుకోడానికి జంకుతున్నారు. ఏమంటే అమెరికాతో విడబడితే అమెరికా మార్కెట్టులో తమ వస్తువులు స్వేచ్ఛగ అమ్ముకోడానికి వీలులేకపోవుటేగాక, జపాను దాడి నుండి రక్షించుకోవడానికి అమెరికా సహాయంకూడా వుండదు.

1940 వ సం॥ ఆగస్టులో ఫిలిప్పైను శాసన సభ అధ్యక్షులగు మాన్యుల్ కుజానుగారికి మితిలేని అధికారం యిచ్చినా అతడు నియంతవలె పరిపాలించుట కిష్టపడలేదు. అధ్యక్షుడు నాలుగేండ్ల కొకసారి ఎన్నుకోబడును. రెండు శాసన సభలు గలవు. ఇపుడు ఫిలిప్పైన్సు అధ్యక్షుడును ప్రజలును మనస్ఫూర్తిగ జపానుకి విరుద్ధంగా అమెరికాకు సహాయం చేస్తున్నారు.

## దేశరక్షణ విధానం

1946 వ సంవత్సరము వరకు యీ దీవుల రక్షణ బాధ్యత అమెరికాదే. ఈ దీవులలో యుద్ధాని కవసరమగు పరిశ్రమలుగాని, ఆయుధాలుగాని నేటి కాలపు పరికరాలుగాని లేవు. సన్యాసి పెళ్లికి జుట్టుకూడా ఎరువే అన్నట్లు అన్నీ పై దేశాలనుండి దిగుమతిచేయాలి. 1922 వ సంవత్సరములోని ఐదు రాజ్యాల ఒడంబడిక ప్రకారం పశిఫికులో కొన్ని ప్రాంతములందు సైనిక నౌకాదళ శిబిరాలు కట్టకూడదని జపాను-బ్రిటనులకు అమెరికా బాసచేసెను. 1934 వ సంవత్సరములో జపాను యీ ఒడంబడికను రద్దు చేసినట్లు, 2 సంవత్సరముల నోటీసు యిచ్చినపిమ్మటనే ఫిలిప్పైను దీవుల రక్షణ కట్టడములు వృద్ధిచేయుటకు అమెరికాకు వీలయ్యెను. ఆ సంవత్సరమే గువంలో సైనిక కేంద్రం నిర్మింపబడెను.

ఫిలిప్పైనులలో అమెరికావారి ఏషియా ప్రాంత నౌకాదళమునందు శాంతి సమయాలలో 1 క్రూయిజరు యుద్ధనౌక (10,000 టన్నులు); ఒక 7,000 టన్నుల క్రూయిజరు, 12 సబుమెరైనులు, సహాయనౌకలు కొన్నిమాత్రం వుండేవి. ఇపుడు వాటికితోడుగా పెర్లు హార్బరు నుండి మరికొన్ని వచ్చాయి. 1939 వ సంవత్సరములో ఒక విమానాలను మోసే యుద్ధనౌక చాల బాంబరు విమానాలు, మరికొన్ని సబుమెరైనులు చేర్చబడినవి. చాల చిన్న నావలు అచటనే కట్టబడుచున్నవి.

నేల సైన్యంలో సాధారణ సమయములందు 10,000 మంది యుందురు. అందు 4,000 అమెరికను దేశీయులగు సుశిక్షుతులు. మిగిలినవారు ఫిలిప్పినో దేశీయులు. 1941 వ సంవత్సరములో యీ సైన్యం ఎక్కువ చేయబడింది. 85 విమానాశ్రమాలు వివిధ దీవులందుగలవు. ఇటీవల యివి బాగుచేయబడినవి. క్రొత్త విమానాలు అమెరికానుండి వచ్చినవి. 1940 వ సం॥ అక్టోబరులో రెండు వెంటాడే వైమానిక దళాలు అమెరికానుండి వచ్చినవి. స్వీడను కొనదలచిన 70 విమానాలు ఫిలిప్పైన్సుకి పంపబడెను. ఆరు నెలలలో మొత్తం 1,000 విమానాలు చేర్చబడతాయని 1941 వ సం॥ మే నెలలో ప్రకటించబడెను. మనీలా పశిఫికు విమానమార్గంలో ముఖ్య కేంద్రం.

1934 వ సంవత్సరమునుండి ఫిలిప్పైను ప్రభుత్వం కామను వెల్తు ప్రభుత్వం అయినది. అపుడు 7,000 మంది గల దేశీయ సైన్యం యేర్పాటు చేయబడింది. తరువాత ఏటేట 40,000 మంది శిక్షణ పొందుచున్నారు. 1941 వ సం॥ మార్చి సరికి 100,000 రిజర్వు సైనికులు శిక్షణ పొందుచుండిరి. సాలీనా 160 లక్షల పిసాను (ఫిలిప్పైను నాణెం) సైనికవ్యయం చేస్తున్నారు.

మనీలానగరం పెద్ద విశాలమగు సముద్రం మొనలోనుంది. ఈ రేవులో అమెరికావారి ఏషియా నౌకాదళం అంతా విడిదిచేయ అవకాశంగలదు. ఈ అఖాతము శిఖరము వద్ద కొరిజిడరు దీవియందు, దూరాన మరికొన్ని దీవులందు తీరపు ఫిరంగులున్నాయి. కోరిజిడరు దీవియందు 4,500 సైనికులు సాధారణంగా వుంటారు. ఇపుడా సంఖ్య ఎక్కువ చేయబడింది. ఇది జిబ్రాల్టరు మాదిరి రక్షణ యేర్పాటులన్నీ కలిగియున్నది. మణీలాను యీదీవియే రక్షించగలదు. మనీలాకు చేరువగ దక్షిణమున కావిటిబే అను సముద్రంగలదు, అచట నౌకాదళానికి కావలసిన మందుగుండు, చమురు బొగ్గు అన్నీ ఉంచబడును. నౌకల మరమ్మత్తులుగూడ చేయబడుచుండును. మనిలాకు 60 మైళ్ళ దూరాన ఉత్తరమున ఒలాంగాపో గలదు. అచట మంచి హార్బరుగలదు. సైనిక కట్టడము లేమిలేవు. సింగపూరు నౌకాశ్రయము నందు గూడ అమెరికా నౌకలుండుటకు మరమ్మతులకువీలున్నది.

వేలకొలది చిన్నచిన్న దీవులుండుటచేత వాటినడుమను సబుమెరైనులు దాగొనుటకు వీలుండును. అందుచే యీదీవుల రక్షణ సమస్య చాల చిక్కైనదే. జపానువారు ముందుగ చీనావారిదగు హైనాన్ దీవియు, ఫ్రెంచివారిదగు ఇండోచైనా ఆక్రమించుటచే మరీ ఉపద్రవం సంభవించినది.

మొదట్లో సివిలు ప్రజలరక్షణ బాధ్యతగూడ అమెరికాదేయని ఫిలిప్పైన్సు అధ్యక్షుడు కుజనుగారు అన్నారు. కాని తరువాత తామే వహించిరి. ఈ వసంత కాలంనుండి పంటలెక్కువ చేయుట, వంటచెరకు చమురు ఎక్కువ సేకరించియుంచుట, రాధారులు భద్రపరచుట, ఏ.ఆర్.పి. పనులు చేయించుచున్నారు.

ఇటీవల దేశరక్షణ విధానంగూర్చి అమెరికా హై కమిషనరు, నౌకాదళాధిపతి, తదితర ఉద్యోగులు, ఫిలిప్పైను అధ్యక్షుడు, సేనాధికారి తరుచుకలిసి సంప్రదించుకొనుచుండిరి. మార్చి మాసంలో యీప్రాంతాలందు బ్రిటిషు సర్వసేనాధికారియగు సర్ రాబర్టు బ్రూకు పాఫాముగారు సింగపూరునుండి, డచి దీవులనుండి వారి అధికారివచ్చి చీనా సముద్రములందు సమిష్టి రక్షణ విధానం నిర్ణయించుకొనిరి.

# జర్మనులు ఫిరంగులు వదలుకొనిరి.



లిబియా ఎడారి యుద్ధమునందు జర్మనులు అనేక ఫిరంగులను వదలుకొని పారిపోయిరి. టాంకు విధ్వంసియగు యీ ఫిరంగి కొంచెం చెడియున్నది. ఇది ఎంతవరకు పనికివచ్చునాయని ఒక బ్రిటిషు సైనికుడు యోచిస్తున్నాడు.

# అమెరికా శక్తి.

## నౌకలను, సైన్యములను ఎక్కువచేయుట.

అటు జర్మనీ-ఇటలీలతోను, ఇటు జపానుతో యుద్ధంలో దిగుటచేత అమెరికా తన సైన్యాన్ని యెక్కువ చేసుకుంటున్నది; ఆయుధోత్పత్తికూడ ఎక్కువ చేసుకుంటున్నది.

అమెరికా సైన్యాలు ఎంత దూరమైనా పోవచ్చునను చట్టము అమెరికా శాసనసభలో అట్టె ప్రతికూలతలేకుండా అంగీకరించబడెను. అంతమాత్రమున పెద్ద నౌకాదళం యింకో దేశంపై దాడి వెడలడానికి వెంటనే బయలుదేరుతుందనుకోడానికి వీలులేదు. అందుకింకా సమయం రాలేదు. ఆసమయం ఎపుడో అమెరికాకు తెలియును.

ఇతర దేశాలకు సరకు సప్లైచేయు అరువుకౌలు చట్టం యికముందుకూడా పూర్తిగ అమలునందుంటుందని అమెరికా ప్రభుత్వం ప్రకటించెను. అయితే యిదివరకంత ఎక్కువగా యికముందుకూడా సరకు పంపుకోరనుకోడానికి వీలులేదు. ఇదివరకుకంటె అమెరికాలో పరిశ్రమలందు ఎక్కువ గంటలు పని చేస్తున్నారు, ఎక్కువ ఉత్పత్తి చేస్తున్నారు. ఇది దేశ విజయమునకు తోడ్పడగలదు.

అమెరికా నౌకాదళం నూటికి 30 వంతు వృద్ధిచేయుటకు శాసనం చేయబడెను. మొత్తం 900,000 టన్నుల న[illegible] అధికంగా కట్టబడును. అందు 45,000 టన్నుల యుద్ధ నౌకలు ఏడెనిమిది, 29,000 ట. విమానాలు మోసే యుద్ధ నౌకలు, 7,000 టన్నుల క్రూయిజరులు 27, సబు మెరైనులు 80 పైగాను కట్టబడుచున్నవి. ఇవన్ని పశిఫికు సముద్ర యుద్ధంలో ఉపయోగించుటకే. ఇవికాక బ్రిటిషు వారి నౌకాదళంకూడా పశిఫికు ప్రాంతములందుంది.

అమెరికాలో 19 మొదలు 44 సంవత్సరముల మధ్య వయస్సు వారందరిని సైన్యంలో చేరిస్తే 70 లక్షల మంది సైనికులవుతారు.

యుద్ధ విమానాల ఉత్పత్తి నెలకు 2,000 జరుగుచున్నది; యీ నెల 2,400 వరకు టాంకులు కడతారు. 900 పైగా టాంకులు నిర్మింపబడగలవు.

### జపాను ద్రోహం.

జపాను అకస్మాత్తుగ యుద్ధం ప్రకటించుటనుగూర్చి అధ్యక్షుడు రూజువెల్టుగారు అమెరికా శాసన సభయగు కాంగ్రెసునకు దీర్ఘమగు సందేశం పంపేరు. అందులో ముఖ్యమైన అంశాలు యిట్లున్నాయి :—

1. తూర్పు దేశాలన్నింటిలోనున్న డెబ్బయి లేక ఎనభై కోట్ల ప్రజలకన్న ఏడు కోట్ల జపానువారు ఘనులని అధికులని జపాను ప్రకటించింది.

2. న్యాయమగు సిద్ధాంతములపై ఒడంబడిక కుదురుతుందని జపాను అభయమిస్తే ఎన్నివేల మైళ్ళ దూరమైనా పోయి జపాను ప్రధాన్ని చూచి మాట్లాడియుందును కాని, అట్టి భరోసా ఏమి లేకుండెనని రూజువెల్టుగారనిరి.

3. జపాను ముందు అమెరికా రాజ్యంపై గుండ్లు ప్రేల్చిన పిమ్మట అమెరికా సూచనలకు జవాబు అందజేసెను. పెర్లు హార్బరుపై మధ్యాహ్నము 1-30 గంటలకు జపాను విమానాలు గుండ్లు ప్రేల్చిన తరువాత, సాయంకాలం 5 గంటలకు జపాను విదేశాంగ మంత్రి అమెరికా రాయబారివద్దకువచ్చి, తమ చక్రవర్తి పశిఫికు సముద్రంలోనే కాక ప్రపంచమంతట శాంతినికోరుతున్నాడని, తమ ప్రభుత్వం శ్రద్ధగా రాజీకి ప్రయత్నించాలని ఉత్తరువు చేశాడనియు తెలిపెను.

ఇటువంటి మోసంచేసిన జపానుతో పోరునందు చీనా అమెరికా-బ్రిటను మున్నగు దేశాలన్ని కలసి, న్యాయ విరుద్ధమగు దుష్ట శక్తులను అణచివేయగలవని రూజువెల్టుగారు చీనా అధ్యక్షుడగు మార్షలు చియాంగుకాయి షెకుగారికి సందేశమంపిరి.

# ఇండియాలో ఆయుధాలు మందు గుండు తయారుచేయుట.

## ఇరాకు ప్రాంతాలకు రైళ్ల సామాను.

## వస్త్రాలు, తోలు సామానుల సప్లై అధికమయింది.

ఇండియాలోనున్న వివిధ ఆయుధోత్పత్తి ఫ్యాక్టరీలందు గత కొద్ది వారాలలో పని చాల యెక్కువ జరుగుచున్నది. తుపాకులు, అనేక రకముల ఫిరంగులు చిన్నవి, పెద్దవి, మందు గుండు, తోటాలు, గుండ్లు, చేతి బాంబులు, ఫిరంగులను నడిపే బండ్లు, బ్రెనుగను మఘోణాలు, సున్నీలు, సిపాయిలకు వంటపొయ్యిలు, దూర్భిణి యంత్రాలు, యిలాంటివి అనేకం తయారుచేస్తున్నారు. ఫిరంగులు, తుపాకుల మరమ్మత్తుకూడ యీ ఫ్యాక్టరీలలో జరుగుచున్నది. విదేశాల నుండి దిగుమతయ్యే సరకేదిలేకుండా మందు గుండు తయారుచేయుట ఇండియాలో కనిపెట్టబడెను. ఇపుడు ఫిరంగి బండ్లకు ఉక్కు కవచపు రేకులు యీ ఫ్యాక్టరీలలో తయారవుతున్నాయి.

క్రొత్త ఉక్కు ఫ్యాక్టరీలు, విమానాలనుండి పడవేసే బాంబులు తయారుచేయు క్రొత్త యంత్రాలు స్థాపించుటకు యేర్పాటులు జరుగుతున్నాయి. తూర్పు దేశాల సభవారికి కావలసిన సరకుకూడ ఇండియాలో వడిగ తయారవుతున్నది.

మధ్యధరా సముద్ర ప్రాంతాలకు కావలసిన ఇంజనీరింగు సామానులు తయారుచేయు పని యెక్కువచేయబడింది. పెట్రోలు నిలువయుంచు టాంకులు, లారీ టాంకులు, హామిల్టను వంతెనలు, ఊగే వంతెనలు, మోసుకపోయే వంతెనలు, బరువులెత్తే క్రేన్సు, మోటారు బండ్లు, స్టీరపు పంపులు, పోస్టు టెలిగ్రాఫ్ రైల్వే సామానులుకూడా ఇండియాలో యెంత యెక్కువగ తయారుచేయగలరో అంత యెక్కువ తయారుచేసి పంపుచున్నారు. వారం వారం సరకు తయారుచేసి పంపి, క్రొత్త ఆర్డరులు యెక్కువగ పుచ్చుకొనుచున్నారు. అన్ని రకాల ఇంజనీరింగు సామానులు ఇండియాలో పక్షం దినములలో తయారైనవాటి విలువ రూ 2,25,00,000 లు యుండును.

ఇరాకు ప్రాంతాలకు రైలు పెట్టెలు, ట్రక్కులు, క్రాసింగులు, ఇంజనులు త్రిప్పే సాధనలు వందలకొలది పంపబడినవి.

### నౌకా నిర్మాణం.

సముద్రాలలో పోయే ట్రాలరు నౌకలు, నదులలో కూడా పోయే చిన్న రకం నౌకలు నిర్మించు యేర్పాటులు గూడ క్రమేణ యెక్కువ చేయబడుచున్నవి. తిరువాంకూరు అను ట్రాలరు ఇప్పటికి ఇండియాలో కట్టబడిన ప్రథమ నౌక. డిసెంబరు మొదటి వారంలో దీని ప్రారంభోత్సవం జరిపేరు. ఇంకను రెండు క్రొత్త నౌకల ప్రారంభోత్సవం యీ నెలలో జరుగనున్నది.

వస్త్రములు, తోలు సామానులు, ఆహారపదార్థాలు, కలప, రసాయనములు, మందులు, బండ్లు మున్నగునవన్నీ తూర్పు సామ్రాజ్య దేశాలకు కావలసినవన్నీ యిపుడు ఇండియాలో తయారగుచున్నవి. ఉత్పత్తి సంతృప్తికరంగానే వుంది.

విమానాలనుంచి దిగే సాధనమగు గాలి గుమ్మటాలు తయారుచేయుటగూర్చి ఇండియాలో యిపుడు ప్రత్యేక శ్రద్ధవహించుచున్నారు. వస్త్రముల కర్మాగారములందు ఇపుడు నెలకు 80,00,000 దుస్తులు తయారవుతున్నాయి. విడాది క్రిందటి వుత్పత్తికన్న యిది నాలుగు రెట్లు ఎక్కువ.

సైన్యానికి కావలసిన తోలు జోళ్లు, జీనులు, కాన్వాసు జోళ్లు ఇంకా ఎక్కువగా తయారుచేయడానికి క్రొత్త ఫాక్టరీలు కట్టుచున్నారు.

ఆహారపదార్థాలలో ఉర్లగడ్డ ఒరుగులు, బార్లి, బిస్కట్లు, సిరపు, సిగరెట్లు, పొగాకు యిత్యాదిని ఇండియానుండి పంపబడుచున్నవి. కర్రసామానులకుగూడ గిరాకి హెచ్చింది. రూ 3,00,00,000 లు విలువగల కలపకు ఆర్డరు వచ్చింది.

మోటారు భాగాలు తెచ్చి ఇండియాలో జతకూర్చి ఎన్నియో వేల మోటారు బండ్లు ప్రతివారం ఇండియానుండి యుద్ధరంగాలకు పంపబడుచున్నవి.

### ఇండియా కాగితం పరిశ్రమ అభివృద్ధి.

ఇదివరకు ఇండియా ప్రభుత్వానికి కావలసిన కాగితం మున్నగు వ్రాత పరికరాలు లండనునుండి వచ్చేవి. యుద్ధం వల్ల అది నిలచిపోయినందున అందుకు బదులుగా ఇండియాలోనే ఆ సరకు తయారుచేయబడుచున్నది. అట్లు తయారుచేయించుటకు ప్రైవేటు కంపెనీలను ఇండియా ప్రభుత్వంవారు ప్రోత్సాహించుచున్నారు. 1939-40 వ సంవత్సరములో రూ 46,26,000 లు కాగితం ఇండియా ప్రభుత్వంవారు కొన్నారు. 1940-41 వ సంవత్సరములో అంతకన్న రూ 8,18,000 లు సరకు ఎక్కువ కొన్నారు. ఈ వత్సరం 9,531 టన్నుల కాగితం ప్రైవేటు కాగితపు మిల్లులలో ఇండియాలో తయారుచేయించ నిశ్చయించిరి. కాని ఆరు నెలలలోనే 8,136 టన్నులు తీసుకొనిరి. కాగితం తయారుచేసే మిల్లులకు అవసరమగు రసాయనములు తెప్పించి యిస్తున్నారు.

యుద్ధం రావడంవలన ప్రభుత్వ కార్యాలయములందు పనియు, దానితోపాటు వాడుక హెచ్చింది.

ఇదివరకు నెలకు 200 పైపు రైటరులు ప్రభుత్వంవారు గొనేవారు. ఇపుడు నెలకు 600 కొంటున్నారు.

ఇండియా ప్రభుత్వంవారి స్వంత ముద్రణాలయములందు పని యెక్కువై ప్రైవేటు ప్రెస్సులలో కొంత పని చేయించుచున్నారు.

# బ్రిటిషు విమానదళమునందు భారతీయులు.

## 100 మంది పెద్ద వుద్యోగాలలో నున్నారు.

## లండనులోనున్న భారతీయులందరు పనులు చేస్తున్నారు.

ఇండియానుండి పోయి ఇంగ్లాండులో చదువుకుంటున్న విద్యార్థులలో 500 మంది యుద్ధం ప్రారంభమయినాక మన దేశం రాకుండా అక్కడే వుండిపోయినారు. అందులో సుమారు 100 మంది విమానదళమునందు పనులలో చేరిరి. తక్కినవారు చేరనున్నారు. సుమారు 40 మంది వున్నతోద్యోగాలలో నున్నారు. తక్కినవారు విమానాలు నడుపుటయందు మరమ్మతులు చేయుటయందు వ్యాయామ విద్యాబోధకులుగను పనిచేస్తున్నారు. కొందరు అతి వడిగాపోవు విమానాలను నడుపుచున్నారు. ఈ పనులయందుండు క్రొత్తదనము సంధభిలాష ప్రమాదాలను ఎదుర్కొనే ఉత్సాహం వారికి ఎక్కువగ నున్నవి. ఇతర జాతులవారగు ఉద్యోగులతో చక్కగ కలసిమెలసి తిరుగుచు బాగుగ ఆనందించుచున్నారు.

భారతీయబాలురు శిక్షణ పొందుటకు ఉత్సాహంకలిగి మంచి చురుకుగ ఉంటారని వారి పైఅధికారులు చెపుతూ వుంటారు. విశ్వ విద్యాలయ విద్యలు వెనుకపెట్టి కష్టతరమగు పనులకు అత్యంత వుత్సాహంగా చేరుతున్నారు. కొందరు భారతీయులు రాత్రిపూట విమానాలను నడుపుటగూడ నేర్చుకుంటున్నారు. అందుకు కావలసిన ధైర్య సాహసములు మంచి దృష్టి బలము భారతీయ విద్యార్థులలో ఎక్కువమందికి గలదు. నేలనుండి విమానాలు దిగగానే వాటి మరమ్మతు పనులు సరిచేసి తిరిగి ఎగురునట్లు చేసే యింజనీరింగు పనులుగూడ భారతీయ ఇంజనీరింగు విద్యార్థులు చేయుచున్నారు.

ఒక భారతీయ విద్యార్థి మొదటి ట్రెయినింగు కాలములో సమర్థత ఒడయలేదు. మరి కొన్ని గంటలు ఎగిరి అనుభవం గడించుటకు అవకాశమిమ్మని అతడు ఎంతయు ప్రాథేయపడెను. అధికారులు కాదనలేకపోయిరి. వేరొక అవకాశమిచ్చుసరికి అతడు పూర్తిగ సమర్థతబడసి యిపుడు సార్జెంటు పైలెటుపనిలో, స్పిటు ఫైరుఫైటరు విమానాలను నడుపుచున్నాడు. ఇంకొక భారతీయ యువకుడు బాంబరు విమానాల నాయకుడుగా నున్నాడు. అతడనేకసారులపుడే శత్రుదేశంపై దాడిసలిపి వచ్చెను.

ఇరువురు భారతీయబాలురు రాయలు విరుఫోర్సు శిక్షణ తరగతిలో చేరి మూడు నెలలనుండి తరిఫీ దవుతున్నారు. ఇద్దరు ఒకే గదిలోనుండి ఒకరినిమించి ఒకరు చదువుచు పరీక్షలు ప్యాసవడంలో పేర్బడ్డారు. వారితో కలసి చదువుకొనుచున్న బ్రిటిషు బాలురు “వీ రిద్దరిలో యీ నెలయందెవ్వరు ఎక్కువగ ప్యాసవుతారు” అని ప్రశ్నించుకొనుచున్నారు.

ఆజానుబాహులగు భారతీయ యువకులు నీలం దుస్తులతో ఎడమభుజంపై “ఇండియా” అను అక్షరములతో చూడముచ్చటగనుండి ఇతర సామ్రాజ్య దేశీయ విద్యార్థుల కేమాత్రము దీసిపోరు. విందులలోను వినోదాలలోను మంచి ఆకర్షవంతంగానుండి మొదటిస్థానం ఒసంగబడుచున్నారు. వారికి ఇంగ్లాండులో మంచి సదుపాయాలొసంగబడుతున్నాయి. రాయలు విమానదళమునందు భారతీయులు బాగా పనిచేస్తున్నారు.

---

# వైస్రాయిగారి హెచ్చరిక.

## మానవకోటికి కష్టసమయం వచ్చింది.

## ఇండియాలో పరిశ్రమల అభివృద్ధి వివరములు.

## భారతీయులందరి ఐకమత్యావసరము.

భారతదేశములోని రాజప్రతినిధియగు గవర్నరు జనరలుగారు యీ వారంలో కలకత్తాయందు వర్తక సంఘంలో ఉపన్యసించుచు, మానవకోటి కంతకు కలిగిన యీ కష్టసమయంలో భారతీయ ప్రజలు తమతమ విభేదాలను మరచిపోయి, సమిష్టి ఆదర్శమునకు పాటుపడవలెనని హెచ్చరించిరి. ప్రపంచమంతటిలోను బలవత్తరమగు సేనలు బ్రహ్మాండమగు యుద్ధమునందు తగుల్కొనివున్నాయి. దీని ఫలితం మానవజాతినంతకు కొన్ని వందలేండ్లవగకు మరువరాకుండా బాధించగలదు. ఇట్టి సమయంలో ఇండియా చూస్తు పూరుకోరాదు. ఇండియాకుగూడ బాధకలదు. అందుచే ఇండియా యిందులో చాల ముఖ్యంగా పాల్గొంటున్నది. విజయం కలుగుట అందరికి అవసరం. ఆ విజయం సంపాదించుటకు విభేదాలు మరచి అందరంకలసి పని చేద్దాం, అని వైస్రాయిగారన్నారు.

వైస్రాయిగారు యుద్ధసహాయపు పనులనుగూర్చి, ఇండియాలో పరిశ్రమల అభివృద్ధిగూర్చి, భారతీయ సైనికుల ధైర్య స్థైర్యములగూర్చి యీ దిగువ రీతిని ఉపన్యసించారు :—

నేడు అందరి మనస్సులో ఎక్కువగ బాధించుచున్నది జపాను అకారణంగా అమెరికా ఇంగ్లాండులపై యుద్ధం ప్రకటించిందన్న విషయం. జర్మనుల ననుసరించిన జపానీయులు, మోసమునందు దారుణత్వమునందు వారిని మించిపోయినారు. ఈ జపాను చర్య మనకో హెచ్చరికవంటిది. దీనివలన మన బాధ్యత హెచ్చినది. ఈ యుద్ధ ప్రారంభంలోవలెనే, యిపుడుకూడ భారతీయ ప్రజలందరి సానుభూతి సహాయము ప్రభుత్వంవారి కుండగలదని నమ్ముచున్నాను. గత ఏడంతా మనం చాల కష్టాలుపడ్డాం, చాల ఆందోళన పడ్డాం. 1941 లో గూడ యుద్ధం ముగియలేదు. ముందు నెలలలో యింకా ఎన్నో కష్టాలునష్టాలు పడవలసి యుండును. అయినా ఒక ఏడు గడిచింది కదాయనే సంతోషించాలి.

“ఆఫ్రికాలోని ఇటలీ సామ్రాజ్యాన్ని ఆక్రమించుటయందు సేనానాయకుడగు సర్ ఆర్చిబాల్డువావెలుగారికి భారతీయ సేనలు ఎంతో తోడ్పడినవి. ఆ విషయం వారిపుడు ఇండియా సేనాధికారిగావచ్చి స్వయంగా చెప్పగా విన్నాం. ఇపుడు యీ సమయంలో కూడ

భారతీయ సైనికులు ఉత్తరాఫ్రికాలో అత్యద్భుతంగా పోరాడుచు, తమ సాంప్రదాయమును నిలబెట్టుచున్నారు. ఇరాకు, పెర్షియాలందుగూడ శత్రువుల యత్నములను పడగొట్టుటయందు భారతీయ సైన్యాలు చాల పని చేసినవి.

పశిఫికు ప్రాంతములందలి యుద్ధం సందడిలో ఆఫ్రికా యుద్ధం విషయం తక్కువమంది గమనించకపోవచ్చును. కాని అచ్చట జరుగుచున్న దీర్ఘ సమరంలో భారతీయ సేనలు పట్టుదలతో పోరుచు ఘనతవహించిరి. ఈ యుద్ధం యొక్క ప్రాముఖ్యత ముస్ముందు తెలియకపోదు. జర్మనులతో సరిసమానమగు క్రొత్తరకం ఆయుధాలు కలిగియున్నాక జరిగిన యీ ప్రథమ యుద్ధంలో మనవారే వారిని మించిపోయిరని తెలియుటకెంతో సంతోషంగావుంది.

ఏడాది క్రిందటనే యుద్ధమునకు ఇండియా ఎంతయో తోడ్పడెను. ఈ పండ్రెండు నెలలోగూడ యీ సహాయం చాల హెచ్చెను. ఇండియానుండి వెడలి విదేశాలలో యుద్ధంలో పాల్గొనుచు ఇండియాను రక్షించుచున్న భారతీయ సైనికుల సంఖ్య యిపుడు మూడు రెట్లధికమైంది. రెండేండ్ల క్రిందటకన్న పదిరెట్లు ఎక్కువైంది. ఇప్పటికి రెండు సంవత్సరాల మూడు మాసాలనుండి యుద్ధంలో దిగియున్నాము. చాల నష్టాలు కలిగినవి. కొన్ని సందర్భాలలో వెనుకబడితిమి. అయినా యీ అనుభవంతో ముస్ముందు మంచి ఫలితం చూడగలం. రానున్న కష్టాలను ధైర్యవిశ్వాసములతో ఎదుర్కొనగలం. ఆ విషయంలో సామ్రాజ్యంలో యే యితర దేశాలకు ఇండియా తీసిపోదు. ఇండియా ఇదివరకు చేసిన కృషికన్న యిపుడు కృషి యెక్కువ చేయగలదని నేను పూర్తిగ నమ్ముచున్నాను" అని వైస్రాయిగారు తెలిపిరి.

ఇండియాలో పరిశ్రమలను అభివృద్ధిచేసి ఆయుధోత్పత్తి చేయుచు, సైన్యాలకు కావలసిన యితర పరికరాలు సామానులు సప్లైచేయుటకుగూడ ఇండియాలో జరుగుచున్న పనిని వైస్రాయిగారు మిగులకొనియాడిరి. ఇండియాలో నౌకాశ్రయములందు ట్రాలరు నౌకలు కట్టబడుచున్నవనియు, యితర చిన్న నౌకలుకూడ నిర్మించుచున్నారనియు, పెద్దవాటికి మరమ్మత్తులు చేయుచున్నారనియు తెలిపిరి.

సివిలు ప్రజల రక్షణగూర్చి తమ ప్రభుత్వంవారు తగిన యేర్పాటులు చేయుచున్నారనియు, యీ కార్యమునందు తనకు శ్రీ ఈడ్పుగంటి రాఘవేంద్ర రావుగారు సహాయం చేయుచున్నారనియు, వీరు ఇంగ్లాండులో యుద్ధ సమయమునందుండి, దేశరక్షణ విధానం స్వయంగాచూచిన అనుభవం గలవారనియు, వైస్రాయిగారు చెప్పిరి.

---

ఈసారి యుద్ధ సంచిక 1942 వ సం॥ జనవరి 9 వ తేది శుక్రవారము వెలువడును.

సలహా: ఇకముందు చూచుకొనుటకు యీ మదరాసు యుద్ధ సంచికను మీరు భద్రపరచుకొనుడు.

[మదరాసు సమాచారముల ఆఫీసరుగారు తమ వందనములతో దీనిని మీకు పంపుచున్నారు.]